# వేదమతము నాస్తికమతము ఆర్యులదైవములు.

ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రుఁడగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.


బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

**1926.**




వెల రు 0—8—0

తమకంటె నత్యధిక శక్తికలవారనియు తమకంటె నధిక నీతిమంతులనియు కావుననే పూజనీయులనియు పూజింపసాగిరి. కొందఱు దైవములను మానవాకారములుగల విగ్రహములుగనొనర్చి యారాధింపసాగిరి. ఇట్లు కొంతకాలమైనవెనుక, బుద్ధికౌశల్యముగలవారు కొందఱాలోచించి, దైవములకు మానవాకార వికారములు నిషేధించిరి. వేదాంతవిచారులగువారు కొందఱు జ్ఞానస్వరూపమే దైవమని యెన్నిరి. వర్ణింపనలవికానట్టియు, నగోచరమగునట్టియు, చిత్రమహిమలు గలిగించునట్టియు, శక్తులన్నియును నొక్కరూపుగొనియున్న దైవమొక్కఁడేయని కొందఱుతలంచిరి. ఇదియే యేకదైవోపాసన బహుదైవోపాసనము లొనర్చుచు విద్యాతిశయ సామర్థ్యమున నాలోచించి చిత్తశుద్ధిఁగాంచినఁగాని యేకదైవోపాసన సిద్ధింపదు. ప్రపంచమునందిప్పుడుగల నాగరికతయు బుద్ధికుశలతయు బహుదైవోపాసనలనుండి ఫలించినవనుటకు సందియములేదు. నేఁ డేకదైవోపాసకులను క్రిస్టియనులున్ను, జ్యూలున్ను, మహమ్మదీయులున్ను నొకానొక కాలమున బహుదైవోపాసకులుగ నుండినవారేను. వీరొనరించునది మానసవిగ్రహపూజ. ఇతరులొనరించునది లోహవిగ్రహపూజ. ఏకదైవోపాసనాశక్తి ప్రారంభమునఁగుదురుట దుర్లభము. అట్టిశక్తి, గొప్పసక్తికిఁగలుగును. ఈవిషయమున నిమ్రోదనువానికిని నేబ్రహాంకును జరిగిన వాదము సూక్ష్మముగ నిందువ్రాసెద.

నిమ్రోదు. ఏబ్రహాం! నీతండ్రులుపూజించిన విగ్రహములను నీవుపూజింపవు. అగ్నిదేవుని స్తుతింపుము.

ఏబ్రహాం. అగ్ని నీళ్లచేఁ జల్లారునుగదా; నీళ్లనేల నుతింపఁగూడదు?

నిమ్రోదు. అట్లయిన నీళ్లనునుతింపుము.

ఏబ్రహాం. జలమునుఁ దనలోనుంచుకొనిన మేఘము నేలనుతింపఁగూడదు?

నిమ్రోదు. మేఘమునే నుతింపుము.

ఏబ్రహాం. మేఘములనుఁ బాఱఁదోలు గాలి నేల నుతింపఁగూడదు?

నిమ్రోదు. గాలినే నుతింపుము.

ఏబ్రహాం. గాలి నెదిరించినిలుచు మానవు నేల పూజింపఁగూడదు?

పైరీతిగ వాదించెను. ఇట్లు నెదిరించుశక్తి లభ్యమగుటకు నెంతః కావలెనో, యెంత యాలోచనకావలయునో యెంతయనుభవము కావలయు. చదువరు లూహింపనగును.

బహుదైవోపాసనమునుండి యేకదైవోపాసనకు హెచ్చవలెననిన నెంతటి

ప్రారంభమున దైవమును నామమెట్లు వచ్చెను? ఆనామము రాకమునుపు
పురాతనార్యులావస్తువును నేమనిపిలుచుచుండిరి? అనుసంధియ ముందఱిహృదయ
ముల నావరించుట సహజమేను. మనమిపుడు భావించుదైవములను నానామము
ప్రారంభమునయెట్లువచ్చినది నేనించుక ముచ్చటించెద.

పురాతనార్యులు విశాలమగు ప్రపంచమునఁ బ్రకాశించువస్తువులున్ను మలిన
వస్తువులున్నుఁ జూచెను. ప్రకాశించువస్తువును "దేవ్" యనిపిలిచెను. "దివ్"
యనఁ బ్రకాశించుటయని ధాత్వర్థము. ప్రకాశించుచుండు వస్తువులనెల్లఁ బ్రేమించెను.
మలినవస్తువులను ఛీత్కరించుచుండెను. పగటిపైఁ బ్రేమ అంధకారమును గన నసహ్యము.
దేవశబ్దమును దైవముననుఁ బేరుగాక ప్రకాశించుటను విశేషణముగ ఋగ్వేదము
నందనేకస్థలముల నుపయోగింపఁబడినది "దేవాయుషస్స" నఁ బ్రకాశించు
నుషస్సులారా యనియర్థము. కాలాంతరమున్నపై నీ "దేవ" శబ్దము మనమిపు
డుపయోగించుచున్న దైవమనెడినర్థమున రూఢికివచ్చెను. ప్రకాశించువస్తువులపైఁ
బ్రేమయు మలినవస్తువులపై నసహ్యతయు జనులకుఁబుట్టుట స్వాభావసిద్ధమని నాకుఁ
దోఁచెను. ఈరీతిగ మానవసృష్టి కాలమునుండియుఁ దరతరములుగ మానసము
ప్రకాశించువస్తువులకే బంధింపబడుచుండినది. ఇట్టితలంపుమానసమునకు నలవాటయి,
యది యొకమతమయ్యెను. ప్రపంచంబున జననమందిన జనులలో నెక్కఁడైనను బై
రీతిగ మతమును సరింపని మనుజుఁడు లేఁడని నేఁ దలఁచెద. ఎంతటినాస్తికుడైనను
మానసమునందు మత మొకవిధముగ బాధింపక తప్పదు. జర్మనీవారు తమకు
మతమే యక్కఱలేదనియును దాము నాస్తికులమ్యేదమనియును జెప్పుచు నటు
లగుటకు నెంతప్రయత్నించినను వారియందే మతాభిప్రాయములు హెచ్చుగఁ బెరు
గుచున్నవి. విపరీత మతాభిప్రాయములు గలవారు కొందఱు గుళ్లకుఁ బోవని
వారనియు దేవపూజలొనర్పనివారనియు నాస్తికులని వెక్కిరింతురు. అదితప్పు.
అట్టివారియందే మతము హెచ్చుగఁ బట్టుపడియుండును. మతమునకును బ్రార్థనాది
కర్మములకును సంబంధములేదు మతములోఁ బ్రార్థనాదికర్మములు వేఱుకారణంబు
లచేఁ జొనఁబడినవి. అడవినరునకు మతమననేమో తెలియకయుండినను వాఁడొకా
నొక కష్టసమయమున, హా! శక్తీయనియో హా! దైవమాయనియో యఱచును.
అట్టి కష్టసమయమున మఱియొకఁడు "హా తండ్రీ" నన్ను గష్టమునుండి తప్పింపు
మని ప్రార్థించును. వారికినది యేమతము. "నేనుపాపిని నన్నురక్షింపుమని"
యంగలార్చుట యొకమతము. ధేల్సుజాతివా రెట్టివస్తువునందును దైవభావముంచు
చుండిరి, బౌద్ధులెందును దైవమేలేదని వాదించిరి, వీరిరువురును దమతమ మతాభి

వాజియొక్క సవితృని గూర్చిన స్తుతి, సకలురు నేర్చి దినదినమును బఠింపవ

(3) "ఆలోచనలేకనైనను, మానస చాంచల్యము చేతనైనను, గర్వము వల్లనైనను, మానవ సహజగుణము చేనైనను, మేమెపుడయిన దైవ విధులకు భంగముగ నటించితిమేని, సవితృా! దైవములయెదుటను, మానవులయెదుటను, మమ్మునిచట నిరపరాధులుగ నొనర్పుము"

(2) "సవితృ" భూమినిఁ బాశములగట్టెననియు, స్వర్గము నే కంభ సాహాయ్యము లేక నిలిపెననియు, తెలుపఁబడినది.

(5) సవితయొక్కఁడే ప్రపంచము నేలును.

(4) సవితచే నభిరక్షింపఁబడిన విధులు భద్రముగ నిలిచినవి.

(3) సవితృమహిమ దైవములు నుతించుచున్నారు.

(2) సవిత దైవములకు నమర్త్యత నిచ్చుననియు, మానవులకు ప్రాణ దానము లిచ్చువాఁడనియు, నుతింపబడెను.

సవితృ, స్వర్ణమయుఁడు, స్వర్ణచక్షువులు, స్వర్ణకరములు, స్వర్ణభుజ రథములుగలిగి ధూళిలేని మార్గమున సంచరించును" అని వర్ణింపఁబడినది స్సంధ్యాకాలమునందలి సూర్యరూపమునకు సవితృనామమని తెలియ ౩. సవితయొనరించు పనులలో నత్యంతముఖ్యమగుపని నీక్రింద వివ క్తములోఁ దెలుపఁబడినది.

[2] వాయులోకముగుండ నిచ్చటికివచ్చుచు మర్త్యులకు నమర్త్యులకు విశ్రాంతినిచ్చుచు, భూతకోటినిఁ జూచుచు, స్వర్ణరథము నెక్కి మమ్ము సమీపించుచున్నాఁడు.

[7] సూర్యుఁడిపుడెచటనున్నాఁడు? ఎవరికిఁ దెలుసును? ఏస్వర్గముపైన వానికిరణములిపుడు వ్యాపించుచున్నవి?

[9] భూస్వర్గములమధ్యఁ దానొనరింపఁదగిన పనులొనర్చుచు, బాధలు నివారించుచు, నంధకారంబునడఁచుచు స్వర్గమునకుఁ బోవుచున్నాఁడు.

పైఋక్కులలో నిప్పటివారొక విశేషవార్తను దెలియఁదగినదిగనున్నది. నవమున సూర్యుఁడు సముద్రమునఁ బడిపోవునను దురభిప్రాయమిప్పటికి రికిఁగలదు. సూర్యుఁడు రాత్రి పశ్చిమమునుండి తూర్పునకు రెండవఖండమున

సంచరించుచుండుననియు సవిత వానికిఁబురోగామిగ నుండుననియు రెండవ ఖండమువారికి మనపశ్చిమము తూర్పుగనుండుననియు ప్రపంచమారూపముననే యుండుననియుఁ దెలియవచ్చుచున్నది. ద్వాదశాదిత్యులకు సూర్యశబ్దము సామాన్యముగనుండునని తోచుచున్నది. సవితనుగుఱించి మఱియొకఋక్కునఁ గొన్ని విశేషాంశములున్నవి.

2. 38. [2] సవితృ బలమైనదైవము. తనకరములు భుజములు నాకాశమునకుఁ జాచెను. అచ్చటివస్తువులు వానివశమాయెను. జలములు వాని యాజ్ఞలోఁబడెను. మారుతము వానికిలొంగెను.

[3] తనకు విశ్రాంతిలేనటుల గుఱ్ఱములనుదోలి పిదప వానిజీనులుదీసి పథికులకు విశ్రాంతినిచ్చెను. గరుత్మంతుని వేగమునణఁచెను. దయాళువగు సవితృ వాజ్ఞానుసారముగ నంధకారమువచ్చును.

[4] నేతకాడు తననేత వస్త్రమునుజుట్టెను. పనివాఁడతనిపని మధ్యనే వదలెను. ఈదైవము కాలవిభజనఁ జేయుచున్నాఁడు. సవితృ దైవమునకు విశ్రాంతియే లేదు.

[5] మర్త్యుఁడువసించు ప్రతిగృహమునను గృహదీపము తనతేజమును దూరముగ వ్యాపింపఁజేయుచున్నది. తల్లి కొమారునకు నన్నము పెట్టుచున్నది. దైవము జనులకు నాహారాపేక్ష పుట్టించుచున్నాఁడు.

[6] ధనార్జనకు వెలికివెడలినవాఁడు మఱల గృహముఁజేరును. దూరముగఁ బ్రయాణమయి పోయినబాట సారిమనము తనయింటిపై నుండును. ప్రతియొకఁడును తనపని యర్ధమయియుండినను ధనగృహముఁజేరఁ బ్రయాణమగును. ఇదియే దైవసంకల్పము.

[8] చాంచల్యము గలిగినట్టియు గంతులువేయునట్టియు చావ సాయంత్రియయినతోడనే తనకు జలములో సరళమగుస్థలమును వెదకికొనును. పక్షులెల్లఁ దమగూళ్లువెదకును. పశువులు తమదొడ్లవెదకును. దైవము ప్రాణకోటి నీరీతినుంచినాఁడు.

పై ఋక్కులు పాశ్చాత్యపండితులు మెచ్చినారు. ఇట్టివిషయముల నిదే రితిగ బైరన్ యను కవిడాన్ జ్యుయన్ కాంటో 3. 107-వ భాగమున వర్ణించినాఁడు.

మఱియొకఋక్కున సవితృ ప్రజాపతియనియు విశ్వకర్మయనియు ననేకరూపములు గొనినవాఁడనియు వర్ణింపఁబడినాఁడు.

3. 55. [19] త్వష్ట్ర సవితృ విశ్వరూపములుధరించి జీవకోటినిఁ బుట్టించి రక్షించుచున్నవాఁడు. జీవకోటి వానికిఁజేరినది. వాఁడు ప్రపంచ పాత్రలు రెండునిర్మించెను. వానిలోనెల్లఁ దనతేజమునించెను. పైవర్ణనలు చూచినచో సూర్యుఁడును సవితృనొకరయినను సవితృ రూపమందిన దైవమే సర్వారాధ్య దైవమనియు తత్కారణంబు ననే గాయత్రీమంత్ర మూర్దైవమునుగుఱించి విశ్వామిత్రులు రచించిరని తెలియవచ్చుచున్నది. సూర్యుని సవితృరూపమునందు ప్రాణవాయువునిచ్చు గుణమున్నదికావున నాదైవము నింతగ వర్ణించినారు. ఈ సవితృదైవమే దైవములలోనెల్ల హెచ్చుదైవ మని ప్రాచీనఋషులెన్ని దినదినమును దామప్రార్థించు గాయత్రీ మంత్రము సవితనుగుఱించి రచించిరి.

2. [10] దేవాగ్రగణ్యుఁడగు సవితృ యొక్కయశఃప్రకాశమును మేమందు నటులాదైవము మామానసముల బోధింపనిమ్ము. పైమంత్రమునే ప్రణవాక్షరముఖ్యముగ నార్యులిపుడును త్రికాలములందు జపించు చుందురు. వేదఋక్కులకెల్ల నిది శిరోరత్నమని భావించినారు.

సూర్యునకు మిత్రుఁడని యొకపేరున్నది. స్నేహితునిబలె జనులకు రమిడి పోషించుచుండునని యర్థము. మిత్రావరుణు లిరువురు స్వర్ణరథమెక్కి ఃకాలము సంచరింతురనియు సాయంకాలము తమరథమునకు నినుపకాడ మరనియు.

2. (8) లోఁ బలుకఁబడినది. ఇనుమెల్లెడల నినుమును సూచించును. సాయం కాలమున నంధకారవ్యాప్తిచేఁ గాడిమాను నల్లనగునని తెలిపినారు.

సూర్యునకు మధ్యాహ్నకాలమున విష్ణువని పేరు. విష్ణునామము సూర్యుని ాన్యనామమని కొందఱు వచించిరి.

2. (17) } లో ప్రపంచమంతయు విష్ణువు సంచరించెను. ప్రపంచమును మూడుపాదములచే సంచరించెను. అనఁగ నాకాశాంతరిక్ష భూము లందుఁ గిరణములు వ్యాపింపఁజేసెనని భావము. ఈ ఋక్కులలో నైనను విష్ణువునుగుఱించిన మఱియే ఋక్కులలోనైనను, పురాణ గాథలలోఁ బలుకఁబడిన రీతిగ విష్ణువవతార పురుషుఁడనికాని, ముఖ్యదైవమనికాని ఋగ్వేదమునఁ బలుకఁబడలేదు. ఐతరేయ బ్రాహ్మణములోను (6. 15) శతపద బ్రాహ్మణములోను (1,2-5)

విష్ణువు సంచరించునంత ప్రపంచమునుగుఱించి వ్రాయఁబడినది. శతపథ బ్రాహ్మణములో (14-1-1) తుదిభాగమున విష్ణువు సర్వోత్తమదైవమని స్థాపించినదిచూచి యింద్రుఁడాదైవము తలఁ గొట్టెనని చెప్పఁబడినది. ఛాందోగ్యోపనిషత్తులో ఘోర ఆంగ రిసుల శిష్యుఁడు కృష్ణుఁడని పలుకఁబడినది. ఇంద్రుఁడు విష్ణువును దలనఱకెననిన మాధ్యాహ్నకాలమునందు విష్ణువు తలయెత్తి యాకాశమధ్యమున నుండును. మధ్యాహ్నసమయము మీఱినతోడనె పశ్చిమమునకు వాలును. పశ్చిమ మస్తమించుదిశ కావున విష్ణువు యొక్క తల నిక్కుతగ్గెను. తత్కారణంబున నింద్రుఁడు విష్ణువు తలనఱకెనని పలికినారు. ఋగ్వేదమున విష్ణువునుగుఱించిన కొన్ని ఋక్కు లిచటవ్రాసెద.

M. 1. 154. (1) భూమి నలుదిశలును సంచరించిన విష్ణువుయొక్క సాహసకర్మ ములు నేఁ బలికెద. స్వర్గమునందలి దేవసభలో నున్నతప్రదేశ మందెను. మూఁడుతూరులు తన పదములు విశాలముగనుంచెను.

(2) ఇది తన గొప్పకార్యమని విష్ణువు నుతించుకొన్నాఁడు. వాని మూఁడుపాదముల ప్రదేశములో జీవకోటియెల్ల యున్నది.

(3) ఈ ఋక్కు విష్ణువుకు బలముగ, నున్నతప్రదేశముఁజేరని

(4) ...వాఁడొక్కఁడే భూమ్యాకాశములును జీవకోటినిఁ బట్టినాఁడు.

(6) గుండుచక్రముఁబలె నాలుగుగుఱ్ఱములతోఁ దొంబయి పందెము గుఱ్ఱములను బఱుగిడవిడిచి యతిత్వరితముగఁ బోవుచున్నాఁడు.

మూఁడులోకములు విష్ణువువ్యాపించి ప్రకాశింపఁజేయునది విదితము. ఇఁక నాలవఋక్కుయొక్క యర్థమేమన, సంవత్సరమునకు నాలుగు ఋతువులనియు నొక్కొక ఋతువునకు దొంభదిదినములనియు నాలుగుఋతువులకు మూఁడువందల యఱువదిదినములనియు విష్ణువు వీకాలమెల్లను సంచరించుచుండుననియుఁ దాత్ప ర్యము.

7, 99. (1) విష్ణూ! మేరమీఱినరీతిగ నీవు నీ దేహప్రకాశమున హెచ్చయినస్థల మును మానవులు చేరలేరు. నీకుఁజేరిన రెండులోకములును మే మెఱుంగుదుము. దైవమా! మూఁడవలోకమును నీవే యెఱుంగుదువు.

(2) పుట్టినవాఁడుగాని, పుట్టఁబోవువాఁడుగాని, నీ యత్యున్నత ప్రకాశ

ప్రదేశమునుఁ జేరలేరు. భూమియొక్క పూర్వాదిశాంతములను భద్రముగ బంధించి యాకాశమును గుడారమెత్తి పట్టినావు.

7. 101. (4) బలమగు పాదములచే విష్ణువీ భూమిని సంచరించి మనువుయొక్క మందిరమును సిద్ధపఱచెను. ఋగ్వేదమున విష్ణువునుగుఱించి పలికి నపుడు సలుతావులందు మఱియొకదైవము నా నామమునకు జంటింపఁబడినది. పాదములచే మూఁడులోకములు వ్యాపించువిషయ మొకగాథనుఁ గల్పించి త్రివిక్రమావతారమని పేరిడిరి. ఆ గాథయందలి వామనుఁడదితికుమారుఁడేను. సూర్యుఁడుసైత మదితికొమారుఁడు. పాపరూపమును భూమినుండి పాతాళమునకుఁద్రొక్కి జనులకు స్వర్గ ద్వారముఁజూపెనని రహస్యార్థము. పాదమనఁగఁ గిరణము. విష్ణు వగు సూర్యుఁడు మధ్యాహ్నకాలమునఁ జిన్నరూపమును వహించి మూఁడుకిరణములు స్వర్గమర్త్యపాతాళలోకములలోవ్యాపింపఁజేసెనని భావము. వామనుఁడనఁ జిన్నవాఁడనియర్థము. ప్రకృతిఁసహజచర్యలను గాథలుగఁగల్పించి నిజమగువార్తలుగఁ బురాణములువ్రాసి జనులను దప్పుదారిఁ ద్రొక్కించిరి. సూర్యునకుఁ బూషణుఁడని మఱియొక నామము. ప్రారంభమునఁ బూషణుఁడు విశేషాధికారము కలవాఁ డుగ నగపడలేదు. కురుబవారి దైవముగనుండెను కావున నీ దైవము రథాశ్వములు, మేకలు, పశుసాధనియను నాయుధము హస్తమునఁ గలవాఁడయి యుండెను.

M. 6. 53. (9)
M. 1. 42. (6) } లో స్వర్ణమునఁ జేయఁబడిన చిన్నకత్తికలవాఁడని పలుకఁబడినది.

పూషణుఁడు వ్యవసాయదైవముగఁ బ్రారంభమున నుండెను. పిదప మర్త్యులకంటె హెచ్చనియు దైవములకు సమానుఁడనియుఁ బలుకఁబడెను.

6. 48. (9) ........ఈరీతిగ నున్నవాఁడు చరాచర ప్రపంచాధిపతి.

1. 89. (5) ........సవితృవిధమున సర్వమునుఁ జూచువాఁడు పూషణుఁడనియు

10. 17. (13) జనిపోయినవారి యాత్మను పితృలోకమునకుఁ గొనిపోవువాఁడ యు వర్ణింపఁబడినాఁడు.

దున్నునాగేలును రక్షింపుమని పూషణుని ఋషులు ప్రార్థించుచుందురు. పశువులను రక్షించుచు, దప్పించుకొనిపోయిన పశువులను వెదకి చిక్కఁజేయు

చుండు దైవము పూషణుఁడని భావించిరి. మృగాదులనుండి వచ్చు నపాయములు రానటుల రక్షింపుమని యార్యులు పూషణుని వేఁడుచుండిరి. దాఁపఁబడిన ధనమును గనుఁగొనుటకుఁ బూషణుఁడు ప్రార్థింపఁబడును. జను లేవస్తువునైనను బోఁగొట్టికొని యుండినయెడల వానిని వెదకుటలో సాహాయ్యపడువాఁడు పూషణుఁడేను. పథికులకును వ్యవసాయికులకును పశువులనుందలు గలవారికిని సాయము జేయువాఁడు పూషణుఁడేను. పథముల స్వామియని పిలువఁబడుచున్నాఁడు. దారులేర్పఱుపుమనియు దారులందు శాత్రవులును దొంగలును బాధింపకుండునటుల రక్షింపుమనియు పూషణునిఁ బ్రార్థింతురు. పూషణుఁడు ప్రాతఃకాలమున సూర్యుఁడు కావుననే

**6. 55. (4-5)** లో పూషణుఁడు చెల్లెలను మోహించినవాఁడనియుఁ దల్లిని వరించినవాఁడనియుఁ బలుకఁబడినది.

పూషణుఁడు నుషస్సు నిరువురు నాకాశమునకు బిడ్డలు కావునఁ బూషణుఁడన్న ఉషస్సు చెల్లెలు. పూషణుఁ డించుక రాత్రియుండగనె పుట్టును. కావున రాత్రికిఁ గొడుకాయెను, పూషణోదయముతోడనె "రాత్రి" సిగ్గుచేఁగాఁబోలు దాచికొనును. కావున "రాత్రి" పూషణునకు భార్యగ నేర్పడెను.

సవితృ సూర్యులుగాక సౌరదైవములలో మిక్కిలి ప్రసిద్ధికెక్కి ఋగ్వేదమునందు పలుతావుల వచ్చువా రింద్రావరుణులు. వీరి జనన మహిమలు దేహసామర్థ్యము రాజ్యముసాధింప వీరిరువురికిఁ గలిగిన ద్వేషము ఋగ్వేదమునందు వివరింపఁబడినది. ఆ విషయముఁ దెలిసినంతవరకు సంక్షేపముగ నిందువ్రాసెద.

ప్రాచీనార్యులు, మూఁడులోకముల నేలు రాజువరుణుఁడని భావించియుండిరి. ఈ వరుణశబ్దార్థ మేమయినదనియు వరుణుఁడెటు దేవశ్రేష్ఠుడయియుండెననియుఁ బ్రారంభమునఁ దెలియఁజేసెద. ఆకాశభూములందుఁగల చరాచర వస్తువులు వానినడుమఁ జిక్కికొనియుండినపుడు మిద్దెకప్పుబలెను గుడారము (Tent) బలె నుండెననుట స్వాభావికముగ నందఱుఁ దెలియఁదగినవర్ణన. అనఁగ భూమి భవనప్రదేశముగను నాకాశ మాయింటిపైఁ గప్పుగను నుండెననిభావము. అట్టి పైఁగప్పునకు సరియయినశబ్దము వరుణమనిరి. అమహాచ్ఛబ్దవిశేష్యములను మహాత్సబ్దములుగ నొనరించి నామములిడుట యార్యుల స్వభావము. కావున వరుణశబ్దము వరుణుఁడయ్యెను. "వృ" యను ధాతువునకుఁ "గప్పుట" యని యర్థము. "వృ" యను ధాత్వర్థము మహాచ్ఛబ్దముగమాఱి, వరుణుఁడను పురుషుఁడయ్యెను. ఆకాశము దైవములకెల్ల జననస్థానమయి పూజ్యతనందెను కావున,

వరుణుఁడును దేవపూజ్యుఁడయ్యెను. కావున రాజయ్యెను. దివియన నాకాశము అకాశము కాలనక్షత్రగతులకును ఋతువిధులకు నాధారపడియుండినందున వరుణునకునా పదవివచ్చెను. ఈరీతిగ సామాన్య శబ్దములర్థవిశేషమున దైవములయ్యెను.

M. 8. 41. లో, వరుణుఁడు గోవులను రక్షించువిధమున జనులతలంపులు రక్షించువనియు, ప్రపంచము నంధకారము చేఁగప్పి ప్రాతఃకాలమున విప్పునట్టి మైంద్రజాలకుఁడనియు, సకలదైవములు వానివిధులకు లోఁబడినవారనియు, త్రిసంధ్యలనువాఁడు ప్రియముగఁ జూచువాఁడనియు, నాలుగు దిశలు నేర్పాటుచేసెననియు, తనప్రయాణమునకుఁ బ్రారంభప్రదేశము ప్రాగ్దిశగ నేర్పఱచెననియు, ప్రాణకోటిని రక్షించువాఁడనియు, ప్రాతఃకాల కిరణముల రహస్యనామములఁ దెలిసినవాఁడనియు, జ్ఞానరూపుఁడనియు నన్నిదిశల బట్టనలెఁజుట్టువాఁడనియు, దూరదృష్టిని మూడు లోకములనుజూచుచు పైనుండు లోకత్రయము నిండినవాఁడనియు, పురాతనలోక సింహాసనమును స్థాపించి, రెండులోకములను విడివిడి జననరహితుఁడై స్వర్గమునుఁ గాపాడువాఁడనియు తెలుపఁబడినది. వరుణ శబ్దము ప్రథమమున నాకాశమై కొంతకాలమునకు వరుణుఁడను పురుషుఁడయి యాకాశరాజాయెను కావున యాకాశ చిత్రమహిమలు వరుణునకువచ్చెను. ప్రాపంచకసృష్టులకును నీతివిధులకును గర్తయయ్యెను. సూర్యచంద్రులు వరుణునిలోచనములైరి. ఒకఋక్కులో సూర్యుఁడు వరుణుని స్వర్ణాశ్వమని పలుకఁబడినది మఱియొకఋక్కులో సూర్యుఁడు వరుణుని స్వర్ణపర్ణపక్షియని పలుకఁబడినది. మఱియు వరుణుఁడు భూమి లేనిప్రదేశమునఁ జెట్టును తలక్రిందుగ నిలిపి వేఱులభాగము పట్టుకొనినాడని వచించినారు. వేరుభాగము సూర్యుఁడనియు, శాఖలు సూర్యుని కిరణములనియు, నార్యుల యభిప్రాయము. భూమ్యాకాశముల మధ్యనుండెడి యంతరాళమునకు రోదసియనిపేరు. ఈ రోదసియందే మేఘమండలము వాయులోకములున్నవి. దీనికి నంతరిక్షమనిపేరు. ఈయంతరిక్ష మార్గములోనే వాయువులువీచునది. మేఘములు గూడునది. మేఘమండలము జలమయమయి దేవగణ సముద్రమయ్యెను. ఇదియే క్షీరసముద్రమని ప్రఖ్యాతికెక్కెను. మేఘము లావులనియును వాని పాలు క్షీరములనియును నార్యులలంకరించి నామములిడిరి. వీనికెల్ల

నధికారి వరుణుఁడేను. ఈ విషయమునుగుఱించిన బుక్కు లనేకము లున్నవి.

M. 5, 85, [1] గంభీరోన్నత పదములచే మించిన యొకబుక్కును, చక్రవర్తియగు వరుణుని యుపకృతినిఁ దలంచుచుఁ జూదుము బలిపశువునుఁ బడవేసిన విధమున భూమినిఁబడవేసి చర్మమునుబఱచినరీతి సూర్యుని యెదుటఁ బఱచినాఁడు.

[2] వృక్షములపైన గాలివీచుచున్నాఁడు· గోవుల పొదుగులలోఁ బాలు నించినాఁడు. గుఱ్ఱములకు జవసత్వములిచ్చినాఁడు. మానసములకు బుద్ధి బలిమి నిచ్చినాఁడు. నీటిలో నగ్నినుంచినాఁడు ఆకాశమున సూర్యునినిలిపినాఁడు. పర్వతములందు సోమలతను బెంచినాఁడు.

[3] మేఘపాత్రను దలక్రిందుచేసి భూమ్యాంతరిక్షాకాశములకు నీరిచ్చుచున్నవాఁడు. భూములుతడపి ఫలము లిచ్చుచువాఁడు. క్షీరబలులను గోరినపుడు భూమ్యాంతరిక్షాకాశములందు వర్షముగురిపించి, పర్వతములను మేఘములలోముంచి బలశాలురగు మరుత్తులుసైతము నడవ నలసటఁ గలిగించుచున్నవాఁడు.

(7) మమ్ము ప్రేమించు వానికినైనను, సోదరునకునైనను, మిత్రునకునైనను సాహాయ్యకారికినైనను, నిఱుఁగుఁ బొఱుఁగువారికినైనను పరదేశికి నైనను బాపముఁదలఁచియుంటిమేని, వరుణా, యాపాపము మా నుండి తొలఁగింపుము.

(8) జూదములందు, ద్యూతకారులబలె, మేము మోసమొనర్చియుండి నను, తెలిసియో తెలియకనో యేదయినను దప్పొనర్చియుండినచో సంకెళ్లను వదల్చినరీతి నా పాపములు వదల్పుము. మమ్ము మీ ప్రేమాస్పదులఁ జేసికొనుము.

M. 7, 87, (1) సూర్యగమనమునకు మార్గము వరుణుఁడేర్పఱచెను. నదుల నీటి పాటుదలకు దోవలుగల్పించెను. పందెము గుఱ్ఱములను నొక్క మార్గమునఁ దీసికొనిపోవురీతిగ దినగమనములకు మార్గమేర్పఱచితివి.

(2) నీ శ్వాసరూపమగు వాయువు, క్రూరమృగ మటవిని ధ్వనించుచు సంచరించినరీతిగ నలుదిక్కుల సంచరించుచున్నది. భూమ్యాకా

శమునందలి ప్రాణికోటినంతయు నీవు ప్రేమముగఁ జూచుచున్నావు.

M. 1, 25. (7) ఆకాశమున సంచరించు పక్షులమార్గములెల్ల, వరుణా! నీవు తెలిసినావు. సముద్రముల రాజువు నీవు. సముద్రములపై సంచరించు నావల మార్గములెల్లఁ దెలిసినావు.

(8) ఋతువిధుల ననుసరించు ద్వాదశమాసములును వానిపిల్లయగు నధికమాసమును నీవెఱింగితివి.

(9) వాయుసంచార మార్గములును నీవు తెలిసితివి. స్వర్గమునందలి దైవములనెల్లఁ దెలిసినవాఁడవునీవు.

ఎనిమిదవఋక్కునకు సంబంధించిన విధులే ఋతువిధులు. సూర్యచంద్ర నక్షత్రాది గ్రహగమనములను నహోరాత్రముల మార్పులును ఋతువుల రాకపోకలును మేఘములు జలగర్భితములగుటయునుఁ బ్రసవించుటయును నిత్యాదులేవిధములగు మార్పులులేక శాశ్వతముగనుండు ప్రకృతిసంబంధ చిత్రమహిమలు. ఈ ఋతుధర్మముల కధికారియై కాపాడువాఁడు వరుణుఁడు. పాపములను దోలఁచువాఁడు వరుణుఁడు కావున జనులెట్టి పాపమొనర్చియుండినను నా పాపఫలమునుండి తమ్ముఁగాపాడుమని వరుణుని వేఁడుచుందురు. వశిష్ఠునకును వరుణునకును మొదట స్నేహముగనుండి పిదప విరుద్ధము వచ్చినందున వశిష్ఠుఁడు రోగిష్ఠియయ్యెను. అక్కారణంబున వశిష్ఠుఁడు వరుణస్తుతి యొనర్చెను. ఆ స్తుతులే వేదవమండలంబున విశేషముగ నున్నవి.

7. 88. (5) వరుణా! మే మిరువురము మిత్రులమయి సంచరించుచున్న పూర్వస్నేహము మఱచితివియా? ఆ మైత్రి యెచటఁబోయెను? అక్కాలమున నీయొక్క సహస్రద్వారమందిరములోఁ నేఁ బ్రవేశించుచుంటినిగదా?

(6) నీకుఁ బ్రేమాస్పదుఁడయి యుండిన మిత్రుఁడు నీకేరీతిగనైనఁ దప్పొనర్చియుండినచో, పవిత్రుఁడగు వరుణా! ననుశిక్షింపకుము. కవికి రక్షకుఁడుగ నుండుము.

7. 86. (2) ఎటు వరుణునితో మరల నేఁ గలసియుండుదునని నా మానసమున నేనే యాలోచించుచున్నాను. అతని యనుగ్రహమునందు నేనేమి సమర్పింతును. దేనిచే నతఁడు తృప్తినందును. అతఁడు సుముఖుఁడయి యనుగ్రహ సూచక ముఖము గలవాఁడయినది నేనెప్పుడు చూడఁగలను?

(3) నా యొనర్చిన పాపమేమయి యుండునది తెలిసికొనుటకయి వరుణా! నేను జ్ఞానుల సరసకుఁ బోతిని, వారినడిగితిని, జ్ఞానులెల్లరు నేకవాక్యతను వరుణునకు నాగ్రహము కలిగించినావని పలికిరి.

(4) వరుణా! నా నేరమేమి? నిన్నుఁ బ్రార్థించు మిత్రునిఁ జంపనగునా? అజేయుఁడగు స్వామీ! నా తప్పేమయినదిన్ని తెలుపుము? నేను నీకు విధేయుఁడనయి నిన్నుఁ బూజించి పాపరహితుఁడనయ్యెద.

(6) మమ్ము దారితప్పించినది స్వబుద్ధికాదు. పరబుద్ధి. అవివేకము, మద్యపానము, జూదము, కోపము, ఇవి మా బుద్ధులఁ జెఱచినవి. వృద్ధులు పిల్లవారిని దారితప్పించిరి. నిద్రసైతము చెడుకార్య ఫలము మాన్పదు.

7, 89. లో వసిష్ఠఋషి వరుణుని కృపఁ గోరుచున్నవాఁడు.

(1) వరుణరాజా! నన్నిపుడు డిఁకఁ జావనియ్యకు. స్వామీ! నన్నుఁ గృపఁ జూడుము.

(2) వాతాహతమై చలించుమేఘమువలె నేను వడఁకుచుఁ బోవుతటి, స్వామీ నన్నుఁ గృపఁజూడుము.

(3) సర్వశక్తిగల దైవమా! అశక్తతచే నేనేతప్పు నొనర్చియుండినను స్వామీ! నన్నుఁ గృపఁజూడుము.

(4) నీటి ప్రవాహామధ్యమున నీ భక్తుఁడు నిలిచియుండినను తప్పిపోదయ్యెను స్వామీ! నన్నుఁ గృపఁజూడుము.

(5) మానవులగు మేము దైవములకు నెంత ముంతొనర్చియుండినను నాలోచనారహితులమై నీ న్యాయవిధులకు నేభంగ మొనర్చియుండినను స్వామీ! యా తప్పునకునై మము శిక్షింపకు కృపఁజూడుము.

వరుణుని ననేకసూక్తములలో మిత్రునిఁజేర్చి జంటగ స్తుతించినారు. సూర్యుని ప్రకాశరూపము మిత్రుఁడు. వరుణుఁడన నాకాశము. మిత్రావరుణులనఁ బ్రకాశరూపమగు నాకాశమని యర్థము. మిత్రుఁ డైరానీలకు సైతము దైవముగ నున్నవాఁడు. మిత్రావరుణు లిరువురు జంట దైవములుగఁ బ్రార్థింపఁ బడినను, మిత్రుఁడు ప్రాతఃకాలమున జనులను నిద్రలేపి వారివారి పనులకుఁ బంపువాఁడని 3, 59, సూక్తములోనున్నది కావున మిత్రుఁడు ప్రాతఃకాల దైవమనియును వరుణుఁడు రాత్రిదైవమనియును గొందఱభిప్రాయపడినారు. అనేకఋక్కులలో మిత్రావరుణులు రాజులనియు ఋతువిధులను గాపాడువారనియుఁ బుణ్యస్వరూపకులనియు

పాంచిశిష్టకులనియు నుండినను జంటగనుండిన మిత్రుఁడు కొంతకాలమునకు దైవ మయ్యెను. వరుణుడు వెనుకకుఁజిక్కి కాలాంతరములపై హీనదశనందెను. సర్వ ప్రపంచాధికారిగనున్న వరుణరాజు జలాధికారిగ నిలిచెను. వానికిఁగల దైవశక్తులను దప్పించిరి. వరుణునుండి లాగఁబడిన పదవు లింద్రునకు నవీనముగ నారోపించిరి. పాతదైవము పడిపోయెను నూతనదైవముయొక్క విజృంభణము బలమాయెను. పూర్వఋషులచే వర్ణింపఁబడిన వరుణునం దేకళంకమును జూపఁబడలేదు. అయినను ఋగ్వేదకాలముననే వరుణుని యధికారమునుగుఱించి వాదముసంభవించి ఋషులు రెండుకక్షులవారుగ నేర్పడి తుదకు వరుణుని రాజ్యాధికారపదవి నింద్రుఁడందెను. ఇటులనే వరుణుని యధికారము చలించుచుఁ దుదకు వరుణుఁడొకదిశకు నధికారిగ నేర్పడెను. ప్రారంభమున వరుణశబ్దమునకుఁగల యర్థ మిక్కాలమున నే మూల డాఁగెనో తెలియరాదు.

ఐరాౕల మతములోనైతము మిత్రావరుణులు జంటదైవములుగ వాడఁ బడినారు. యాశ్నా 1. 11-లో "అహుర-మిత్ర" ప్రీత్యర్థ మొనగింపఁబడు నాగమ విధులలో నా స్తుతుల సాహాయ్యమున "అహుర-మిత్రుల" సమీపింతునని యున్నది. వారిరువురు పావనమూర్తులయి యున్నతసదవి నుండువారు. పైన పలుకంబడిన "అహుర" యను నామమునకు నర్థము వరుణుఁడు. అహురయను నామము సురయను శబ్దముయొక్క మార్పు. అసురశబ్దము ప్రథమమునఁ "ప్రాణము నిచ్చు" ననెడి యర్థమిచ్చుచుండెను. పిదపఁ బ్రాణము నపహరించుననెడు నర్థ మునకు మారెను. రెండవయర్థమునుఁబట్టి యసురశబ్దము రాక్షసవాచక మయ్యెను. వరుణుఁడు రాక్షసరాజాయెను. ఐరాౕలుమాత్ర మా దైవమునకుఁ బదచ్యుతిఁగలుగ నియ్యక ప్రారంభమునుండి దైవముగనె పూజించుచున్నవారు. ఆర్యులదైవము లైరా నుల రాక్షసులైరి. ఐరాౕల దైవము లార్యుల రాక్షసులైరి. ఇంద్రునకు స్వర్గాధి కార మొసఁగు వాదములలో శబ్దములకు వచ్చిన యాపదలివి.

ఏడవమండలములో వరుణునిగుఱించి వశిష్ఠుఁడొనరించిన స్తుతుల సమాన లసమానములుగనున్నవి. దైవభక్తులు సదా పఠింపఁదగినవిగ నున్నవి. వరుణేంద్ర వ్యవహారవాదమునుగుఱించిన ఋక్కులుకొన్ని యుదహరించి పిదప నింద్రుని విషయము వ్రాయఁబూనెద.

వరుణుఁడు తనకు రాజ్యపదవి జననాదిగ బహుకాలముగ వచ్చినదనియు దానినిఁ దానువదలనని వాదించెను. ఇంద్రుఁడు తనకుఁగల బలమునుబట్టి రాజ్యము తనకు రాఁదగినదని కోరెను. అపుడు వరుణుఁడు పలికినదేమనినః—

M. 4. 42. (1) నేను రాజుగ నేలువాఁడను. రాజ్యము నాయది. ప్రాణకోటిని (మర్త్యులను నమర్త్యులను) నేలువాఁడను నేను. మనుజప్రపంచ భవనమునకుఁ బైఁ గప్పుగనుండు నాకాశమునకు నేను రాజును.

[2] నేను వరుణరాజును. అనాదిగనుండు దైవికోన్నత శక్తులు నాయందున్నవి. దైవములెల్ల నా యాజ్ఞ ననుసరించి నాకు విధేయులుగనున్నవారు. ప్రపంచముయొక్క పైఁగప్పగు నాకాశమునకు రాజును నేను.

[4] ఆర్ద్రీతనిచ్చు జలము ప్రవహించురీతిగ నే నొనర్చితి. ఋతువిధులననుసరించి యాకాశమును భద్రముగ నిలిపితి. అదితిపుత్రుఁడగు నేను ఋతువిధుల ననుసరించి ప్రపంచమంతయును మూఁడుభాగములుగ నొనర్చితి.

ఇంద్రుఁడు పై మాటలువిని బదులిడిన విధ మేమనిన:—

[5] యుద్ధసమయములం దశ్వారోహకులును, యుద్ధవీరులును, నా సాహాయ్యముఁ గోరుచుందురు. మఘవానుఁడగు నింద్రుఁడు నేను జనులను యుద్ధములకుఁ బ్రేరేపించుచున్నాను. అసమాన బలవంతుఁడు నేనయి ధూళిని రేచుచున్నాను.

[6] ఇవి యన్నియును నే నొనర్చు సాహసములు. దైవముల శక్తులన్నియుఁ గూడినను నన్నెదిరింపఁజాలవు. స్తుతులును సోమరసమును నన్ను సంతోషపఱచినపుడు రెండులోకములున్ను నాకు భయపడుచుండును.

పైన వివరించిన యుభయవాదములును విని యీ సూక్త మొనర్చిన ఋషి యుభయులు రాజులని తీర్మానించి యుభయులను స్తుతించినాఁడు. ఈ ఋషి త్రసదస్యుఁడను రాజు, పురుకుత్సుని కొమారుఁడు.

పైన వివరించిన వాదములుజరిగి తుదకు నింద్రునకు రాజ్యపదవినిచ్చిరి, అయినను వరుణుని పరముగ నుండిన కొన్ని దైవము లింద్రుని యధికారమునకుఁ బ్రారంభమున సమ్మతింపక దినక్రమముగ నొక్కరొక్క రింద్రునిపరమైరి. వరుణుఁడు రాజ్యచ్యుతుఁడయ్యెను. రాక్షసుల రాజాయెను. దైవము లింద్రునిపరమయిన ఋక్కులును నీ వాదమును గుఱించిన ఋక్కులును బదియవమండలములో 124 సూక్తమున నున్నవి. వానిలోఁ గొన్ని యీక్రింద వివరించెద.

10. 124. (1) అగ్నీ! మే మొనర్చు నాగమవిధికిరమ్ము. ఈ యాగమవిధినిఁ ద్రికాలములందును, నేడుగురు ఋషులచేతను నైదుభాగములుగ నొనర్తుము. మాకుఁ బురోహితుఁడుగనుండి హవిర్భాగములు దైవములకుఁ గొనిపొమ్ము. నీవు బహుకాలమునుండి యంధకారముఁ జేరినావు.

(2) దైవానుగ్రహము లేని యంధకారమున బహుకాలము వసించి యిపుడు మిముఁ జూడవచ్చుచున్నాను. మర్యాదనువీడి, గొప్ప దైవమును వదలి, మిత్రద్రోహియైయె వానిని బాసి నూతనదైవమునుఁ జేరెదను.

(3) అనార్యుల యతిథినిఁ జూచి నే ననేకాగమవిధులకుఁ బోవక నిలిచితిని. ఆర్యుల తండ్రియగు గొప్పదైవమును వదలి యనార్యులచేఁ బూజింపఁబడు దైవమునుఁ జేరెద.

(4) బహుకాలము వరుణుని యారాధనలో నుంటిని. ఇపుడా తండ్రిని వదలి యింద్రుని పరముఁ జేరెద. సోమునితోఁగూడి వరుణుని వదలెదను. రాజ్యములుమారుట సహజము. నాకునది స్పష్టముగఁ దెలుసును.

పైరీతిగ సోమాగ్నులు వరుణునివదలి యింద్రుని పరమయినపిదప నింద్రుఁడు.

(5) ఈ యసురులిపుడు బలహీనులైరి. వరుణా! ఇపుడు నీవు నా యాధీనుఁడవైతివి. రాజా! వివేకావివేకతలుదెలిసి నా రాజ్యముఁ జేరుము. నన్నిఁక రాజుగ నొప్పికొనుము.

(6) ఇదిగో స్వర్గము. సౌందర్యమంతయు నిచటనున్నది. ఇచటఁ బ్రకాశరూపములగు జ్వాలలున్నవి. ఇచట వాయులోకమున్నది. సోమా! రమ్ము. మనమిరువురము వృత్రునిఁ జంపుదము. బలిహోమములంది మాకుఁ బానీయముగమ్ము. నీకు మర్యాదనిత్తుము.

పైరీతి నింద్రుఁడు తనరాజ్యము స్థిరపఱచికొని వరుణునిఁ దనయధికారమునకు లోఁగఁజేసినపిదప, సూక్తఋషి తన తాత్పర్యమును రెండుఋక్కులలోఁ జెప్పుచున్నాఁడు.

(7) బుద్ధిశాలియగువాఁడు తనబుద్ధిచే స్వర్గమును సాధించెను. ఆశక్తుఁడగు వరుణుఁడు నీటిప్రవాహముల కట్టువదలెను. ఇప్పుడు నదులన్నియును, యువతులరీతి, హాసన్ముఖులయి, సంతోషమిచ్చుచున్నవి.

(8) వారిపు డింద్రుని యసమానశక్తికి లొంగినారు. సంతోషముగ వారిపుడు నాట్యమాడుచున్నవారు. ఎల్లవారు నింద్రుని రాజుగ నమ్మి భజించుచు వరుణ వృత్రులనుండి వేఱైరి.

ఇంద్రుఁడెటు జనించినదియు నెటుల శక్తినార్జించినదియు నెటు దైవమయినదియుఁ దెలియక వరుణేంద్రుల వాదమెఱుంగుట కష్టమగును కావున నింద్రుని వార్తఁ దగినంతవఱకుఁ దెలిపి పిదప వారిరువురి వాదమునుగుఱించి మఱల వ్రాయఁ బూనెద.

"వృ" యను ధాతువు "కప్పుట" యను నర్థమిచ్చి వరుణనామమునఁ గప్పునట్టివాఁడయి, యాకాశముగమారి పిదప నాకాశరాజయి, దైవమయి దేవోత్తముఁడయి తుదకు దిశాధికారిగఁ దగ్గి నామమాత్రావశిష్టుఁడుగఁ బరిణమించినరీతిగ నింద్రుఁడును నదేదశకు గుఱియాయెను. "ఇండ్" యను ధాతువునకుఁగల "కుఱియుట" యను నర్థముమారి "కురిపించువాఁడను నర్థమునంది యింద్రుఁడను పుల్లింగ మహత్పబ్దమాయెను. ప్రారంభమునఁ నాయింద్రుఁడు వర్షాకరశక్తులకు నధిపతియై, పిదప రాజయి, పిదప దైవమయి, దేవోత్తముఁడయి కాలాంతరమునఁ బదచ్యుతినంది యొకదిక్కునకు మాత్ర మధికారియై యిపుడు నామావశిష్టుఁడైనాఁడు. వర్షాకాలమున మారుతములు నలుదిక్కులను ఘోరముగ వీచుచు మేఘములను జలింపఁజేయుచు మెరుపుమెరయించు పిడుగుల ధ్వనులు హెచ్చ వర్షముగుఱియు విధముఁ జూడ యుద్ధమున నుభయసేన లొకటినొకటి దాకి ముష్టాముష్టి కచాకచిఁబోరుచు గర్జింపుచు శతఘ్ని మొదలగు నాయుధ ధ్వనులు సలుపుచుఁ గత్తులు తళతళమని ఝళిపించుచు రక్తధారలు గారుచుండురీతి నగపడెను. ఇంతటిచిత్రము గల్పించువాఁడు వర్షాధిపతియని తలంచినపిదప "నింద్రుఁడు" యుద్ధాధిపతియని నిర్ధరించిరి. ఆ యాధిపత్యమునకుఁ దగిన శక్తుల నిచ్చిరి. ఆర్యులొనరించుయుద్ధమున జయములభించినపుడా జయమింద్రునివలనఁ గలిగెనని యింద్రునిఁ దలంచుచు నతఁడే దైవమని ప్రార్థించిరి. ఈరీతిగ నింద్రుఁడు దైవమాయెను. ఆర్యుల జయము హెచ్చయినట్లెల్ల నింద్రుని మహిమసైతము హెచ్చయితుదకు నింద్రుఁడు దేవోత్తముఁడయ్యెను. అంతకుమున్ను దేవోత్తముఁడని తలంచి పూజింపఁబడుచుండిన దేవోత్తముఁడగు వరుణుఁడు మూలకుఁబడెను.

ఈ సూర్యవరుణేంద్రాదులు ప్రకృతి సాంబంధిక శక్తులని (Powers of Nature) నేను పలుమారు చెప్పనేల? ప్రారంభమున వరుణున కాధిపత్యముండినపుడు, వర్షము యొక్క ప్రాముఖ్య మార్యులాలోచింపరైరి, పిదప

ద్వాదశవర్ష క్షామము, శతవర్ష క్షామము సంభవించినతఱి, వర్ష ప్రాముఖ్య మార్యులు చక్కఁగఁదెలిసి, వర్షమే సకలజీవులకుఁ బ్రాణాధారమని యెన్ని వర్షమును గురిం చిన యధికార మింద్రునకు నొసంగిరి. క్షామానంతరము వర్షమువచ్చినపు డింద్రుఁడు వృత్రునిఁజంపి మేఘరూపమున నుండు గోవులను దెచ్చెనని యలంకార యుక్తముగఁ బలికిరి. " వృత్ర " యను శబ్దము " వృ " కప్పుటయను ధాతువునుండి పుట్టినది. ఇచట " వృత్ర " యన, మేఘములు వర్షింపనటుల వాని నావరించినవాఁడని యర్థము. గోవులు తమ పొదుగులలోనుండు పాలును స్రవింపఁ జేయునటుల మేఘములు తమలోనిండిన నీటిని స్రవింపఁజేయును గావున మేఘములను గోవు లుగఁ బోల్చినారు. అట్టి మేఘము లాకాశమున గానరానటులఁ జేసిన " వృత్రు " నింద్రుఁడు చంపి మఱల గోవులను మేఘములను దెచ్చినవాఁడింద్రుఁడు కావున నింద్రుని గౌరవము హెచ్చెను. ఈ విషయమగు ఋక్కులు ఋగ్వేదమునందెల్లెడ నిండినవి. పై యంశము లెల్ల మనమున నుంచుకొని వానినిఁ జదివినయెడల నే కష్టము లేనటుల యాఋక్కు లర్థమగును. ఈ విషయమిచట నింతలో వదలి ప్రస్తు తాంశమగు వరుణేంద్ర సంవాదమునకుఁ బ్రారంభింతము.

ఇంద్రుఁడు పుట్టఁగనె యతిబలశాలియయి దైవములకు భీతిఁ గలిగించు పనులొనర్చెనని,

2. 12-వ సూక్తములో వర్ణింపఁబడినది,

4. 19-వ సూక్తములో నింద్రుని సామర్థ్యమును మెచ్చినారు.

4. 30. (1-5) లో నింద్రుని సామర్థ్యమునకు దైవములు లొంగినారు.

M. 1. 131 (1-3) లో నింద్రునిశక్తికిమెచ్చి వానికి బలులుసమర్పింతురు.

1. 174 ⎫ ఇంద్రుని రాజ్యాభిషిక్తునిఁజేసి వానిశక్తులు నుతింతురు
6. 36. (1) ⎬ " క్రోధమూని యుద్ధమొనర్చిన దైవములనెల్ల నీవొక్కఁడవె
6. 30. (5) ⎭ యోడించి చంపితివి. "

ఆర్యు లింద్రునకు నెంత యాధిక్యము నిచ్చుచుండిరో యంతకంటె నికృష్ట తగ నైరాను లింద్రునిఁ జూడసాగిరి. కావుననే దేవతలను రాక్షసులని పిలువ సాగిరి.

M. 2. 12. [1] ఇపుడేపుట్టి శక్తిచే నతిసాహసుఁడయిన వాఁడును ముందుదైవ ములనెల్లఁ గాపాడువాఁడును శక్తియుతుఁడును, శ్వాసచలనము ననుభయలోకములు జలదరింపఁజేయువాఁడును, నగువాఁడింద్రుఁ డేను.

7. 21. (7) " పురాతన దైవములు సైతము నీ దివ్య తేజమునకు నమ్రులైరి "

అనఁగ నార్యులకుఁ బురాతన కాలముననుండిన దేవగణ మొకటియు, నూతనదేవగణ మొకటియు రెండువిధముల దైవములుండెను. ఇంద్రుఁడు నూతన దేవగణములోఁ జేరినవాఁడు.

1. 131. లో నింద్రుని యెదుట నసురయగు " దివి " తలవంచెను. భూమాత పృథ్వి తలవంచెను. సర్వదైవము లేకవాక్యతగ నింద్రుని దేవోత్తమత్వము నకు సమ్మతించిరి. ఇంతటినుండి మనుజులిచ్చు బలుల నింద్రుఁడు స్వీకరింప సాగెను.

ఇచట "నసురదివి" యనుటలోఁ బ్రాణమునిచ్చుప్రకాశమని యర్థము సేయవలెను ( Goddess of Living light ) సర్వులకుఁ బ్రాణప్రదాయికమగు వస్తువు దివియనుదీపము. ఆప్రకాశము లేనిదే ప్రాణముండదు కావున " అసుర " శబ్దముపయోగింపఁబడినది. " భూమాతపృథ్వి " యన దివివలనఁ బ్రాణముగలిగిన జీవకోటినిరక్షించునది భూమికావున మాతృశబ్ద ముపయోగింపఁబడినది. గాలి వానలు లేక ప్రాణములు నిలువవందునను గాలివాన లింద్రునుండికలుగునని యార్యు లభిప్రాయ పడియుండిరి కావునను నింద్రుఁడే దేవోత్తముఁడని భావించుటకుఁ గారణ మయ్యెను కావుననే M. 1. 174 లో దైవములకెల్ల రాజని యింద్రుఁడు నుతింపఁ బడినాఁడు. అనఁగాఁ బ్రకృతిసంబంధికశక్తు లింద్రునిశక్తికి వశమయ్యెనని యర్థము. ఇంద్రుని బలఫలములగు మేఘోత్పత్తి మరుదుల్బణములు కలిగినపుడుదివి ప్రకాశము డఁగును. సూర్యచంద్రాదిగ్రహముల గతులు బాహ్యేంద్రియములకుఁ గానరావు. అగ్ని రాజిల్లదు. అంధకారము ప్రపంచమంతయును వ్యాపించి యెద్దియుఁ గాన రానటులగును. కావున నింద్రుని యనుగ్రహ మవశ్యకమయ్యెను. ఐరానులార్యుల యింద్రునిఁ దుచ్ఛీకరించి యంతకుమున్ను సనాతనకాలమునుండి యుండిన దైవమగు వరుణుని " అర్ మజ్దు " యను నామమునఁ బూజింపసాగిరి. ఋగ్వేదమునందు వరుణునకు నారోపింపఁబడిన శక్తులన్నియును నొక్కచోటఁగూర్చి " జఁద వస్థ " లోని " అర్ మజ్దుకుఁగల విశేషణములతోఁ బోల్చినయెడల వరుణునకు " అర్ మజ్దు "కు భేదమెద్దియు లేదనుట స్పష్టమగును.

M. 2. 1. (4) వరుణుఁడు దేవోత్తముఁడు. దేవులలో దేవుఁడు. దేవులకు దేవుఁడు. జన్దవస్థలో " అర్ మజ్దు " " భగభగానాం " యని యుంటయ గాక శాసనములో సైత మదేరీతిగ నున్నది.

వరుణుఁడు సూర్యుని నక్షత్రములను జలములను నేలువాఁడని

ఋగ్వేదములోనున్నది. "ఆర్మజ్డు"కు సైత మివే విశేషణములున్నవి. ( Y. 31. 7. )

(3) వరుణుఁ డాగమవిధులకు నధికారియని యుభయుల గ్రంథములలో నున్నది.

(4) సమస్త న్యాయవిధులను నీతివిధులను గాపాడువాఁడు వరుణుఁడని ఋగ్వేదముననున్నది. "ఆర్మజ్డు"కు నిదేశక్తి యుండినటుల Y. 29. 4-6 లో నున్నది.

(5) వరుణుఁడు పాపనాశకుఁడు. ఆర్మజ్డు పాపశిక్షకుఁడని Y. 30. 11, 7, 32 లో నున్నది.

(6) వరుణుఁడు పాతకుల మన్నించువాఁడు. పుణ్యులను రక్షించువాఁడు. (ఆర్మజ్డుసైత మట్టివాఁడేను (Y. 29-11)

(7) వరుణుఁడాదిత్యుఁడు రాజు. ధృతవ్రతుఁడు మాయిక సుశంసుఁడు. సుచక్షువు, సుక్షేత్రుఁడు. పైవిశేషణములే ఆర్మజ్డుకును గలవు.

పై రీతిగ నైరానులు సనాతనకాలమునుండి ఆర్మజ్డను నామమున వరుణుని "ఏకదైవముగ" నుపాశించుచు వచ్చిరి. ఆర్యులుమాత్రము తమయిష్టానుసారము ప్రకృతిశక్తులకు దేవత్వముగల్పించి గౌరవింప నారంభించిరి.

వరుణుని మూలకుఁద్రోసి యాస్థానమునకువచ్చిన యింద్రుని జననవార్తను దెలుపుచు M. 4. 18-వ సూక్తమున్నది. ఆ సూక్తములోని వాక్యములు గొన్నిచోట్ల దురవగాహములుగనున్నవి. ఎవరెవరి నుద్దేశించి పలికినది చక్కఁగఁ దెలియరాదు. అయినను నర్థమయినంతవఱకు నూహలపై నీక్రింద వివరించినాను. ఇంద్రుఁడు గర్భముననుండు కాలముననే విశేషముగఁ బెటేఁగి క్రమమార్గమున రాఁజాలక ప్రక్కలు చీల్చుకొని వచ్చుటకుఁ బ్రయత్నించెనఁట. అపుడు తల్లియగు నదితి.

4. 18. (1) దైవములందఱు జనించినట్టియుఁ బురాతనమునుండి యందఱు సమ్మతించినట్టియు మార్గమిదేను. ఎంతబలవంతుఁడయి పెఱుఁగువాఁడయినను, వాఁడువచ్చు మార్గమిదేను, వేఱుపథము నవలంబించి తల్లినిఁ జంపకుండుము.

ఇం:క్రమః--(2) ఆ మార్గమునుండి నేను వెళ్లను. ఆ మార్గము కఠినము. ప్రక్కలో నుండి యడ్డముగ నేను వెళ్లెదను. ఇదివఱ కింకను గాని పనిని నేఁ జేయవలసినదిగ నున్నది. ఒకరితో యుద్ధమాడవలసినదిగ నున్నది. రెండవవాని నెదురవలసినది.

(3) చనిపోవు తల్లి తలవంచుకొనెను. నా, శపథము నే మరల్చుకొని యెద. నీమార్గ మవలంబించెద. త్వష్టృ గృహమున నింద్రుఁడు సోమపాన మొనర్చెను. శతాధికముగఁ ద్రావెను.

(4) తల్లిగర్భమున సహస్రమాసములు, బహు శిశిరములుండిన బాలుఁడే సాహసకృత్యము లొనర్చును? జనించినట్టి వారిలో వాఁడసమానుఁడు. పుట్టఁబోవు వారిలోనైతము వానిసమానుఁడు లేఁడు.

(5) వానిపుట్టుక నింద్యమని తెలిసి తల్లి వానిని దాఁచెను. అయినను వానికి శూరత్వ మొనఁగూడి వెంటనె పైకి నెగిరెను. తనవస్త్రములు ధరించుకొనెను. భూమ్యాకాశములు నిండెను.

(6) ఈ జలములన్నియును ధ్వనించుచుఁ బ్రవహించుచున్నవి. ప్రవాహము లన్నియు నేమిపలుకునో యే పాషాణమును జీల్చెనో వానినిఁ బ్రశ్నింపుఁడి.

(7) ఆప్రవాహము లా యింద్రునకు స్వాగతము లిచ్చుచున్నవియా యేమి? ఇంద్రునకు నొదవిన యవమాన మీ ప్రవాహములు భరించునా? గొప్పదగు పిడుగను నాయుధముచే నా కొమారుఁడు వృత్రునిఁ జీల్చి నదులకు మార్గమిచ్చెను.

(8) నీ వయస్సు తల్లియగు నేను నిన్ను దూరముగఁ బాఱవైచితిని. నా కడుపునఁబుట్టిన కొడుకును నిన్ను "కుషవ" మ్రింగెను. నా బాలుని పైన జలములను గ్రహించెను. నా సుతుఁడింద్రుఁడు జయశీలుఁడయి లేచెను.

(9) మఘవన్! వ్యంసుఁడు నిన్ను నేలకుఁగొట్టి దవడపండ్లు విఱిచెను. నీవు నా కొమారుఁడు. అటులఁ గొట్టఁబడినను నీవు సర్వాధిపత్యము సాధించితివి. పిడుగుచే దాసునితలఁ ద్రుంచితివి.

(10) ఆజేయతనందిన వృషభేంద్రుని, శక్తివంతుని, నదితి గోవు కనెను. దూడకుఁ బాలివ్వకనే తల్లివదలెను, బాలుఁడు తనదారిఁదాను జూచికొనుచుఁ బోయెను.

(11) అప్పుడు శూరవరుఁడగు సుతుని సరసఁజని పుత్రా! యీ దైవములు నిన్ను వదలిరి. వృత్రునిఁజంపు కార్యమున విష్ణువు ధైర్యమున ముందఱికి వచ్చెనని యింద్రుఁడు పలికెను.

(12) నీ తల్లిని విధవను జేసినవాఁడెవఁడు? నిశ్చేతనుఁడవయి పడిన నిన్నుఁ జంపఁబూనిన వాఁడెవఁడు? నీవు నీ తండ్రినిఁ గాళ్ళఁబట్టి చీల్చినపుడే దేవుఁడు నిన్నాదరించెను?

(13) భూరిబాధలంది శ్వానమాంసమును నేను వండితిని. దైవములలో నన్నాదరించిన వాఁడొకఁడును లేఁడు. నాభార్య దిక్కులేనిదాయెను. గరుత్మంతుఁ డపుడు సోమలతను దెచ్చెను.

పైఋక్కు లసంబద్ధ ప్రలాపములైనను, గొప్పక్షామమువచ్చి జనులకు జలాహారములులేక, దైవములకు బలులులేక నదులింకి నీరులేక, శ్వానమాంసము సైతము దినునంతటి కాలము తటస్థించెననియు నంతటికాలమున భూమి బీటువాఱి, యెండి, యుండెననియు నెంతోకాలమునకు వర్షము వచ్చెననియుఁ దెలియవచ్చుచున్నది. ఇంద్రుఁడు సహజమగు మార్గమునఁ బుట్టలేదను వాక్యమునకు నర్థము, "వాన యొకదిక్కున నేపడక నలుదిక్కులఁబడెననుట. సహస్రమాసములు గర్భములోనుండెననిన, నంతకాలము వలయునంతవాన కురియలేదని భావము. తలిదండ్రులను జంపి పుట్టెననిన భూమ్యాకాశములు జీల్చుకొని వర్షము వచ్చెనని యర్థము. ఇంద్రుని దంతములను తండ్రి విఱుగఁగొట్టెననిన వడగండ్లవాన వచ్చెనని భావము. ఇంద్రుఁడు తనతండ్రినిఁ జీల్చెననిన నాకాశముగుండా యింద్రాయుధము వ్యాపించెననుట. తలిదండ్రులు దూరమున నింద్రునిఁ బాఱవైచిరనిన వానను భూలోకమునకుఁ ద్రోసిరని భావము. ఇటులనే యూహలపై నీ సూత్రమునకు నర్థము సేయవలెను. వానకురియనటుల మేఘములను బంధించి యుంచు ప్రకృతిశక్తికి వృత్రయను నామమిచ్చి వాఁడు జనులను బాధించు రాక్షసుఁడని భావింపసాగిరి. ఈ సూక్తాధికారియగు వామదేవఋషికి నప్పటి భూరిక్షామమునఁ గలిగిన యనుభవము వ్రాయఁబడినదని కొందఱియభిప్రాయము. శ్వానమాంస మతినింద్యమయినను దానినిఁ దినునంతటి కాలము తటస్థించియుండెనని తెలియవచ్చుచున్నది. ఇంద్రుఁడు జననమందినతోడనే యనఁగా, వానవచ్చినతోడనే సోమలతయందు పాలుద్భవించును కావున సోమపానమునం దింద్రుఁడు పుట్టినతోడనే యపేక్షకలవాఁడాయెనని వ్రాయఁబడినది. గరుత్మంతుఁడు స్వర్గమునుండి

ఇ: సోమలతఁ దెచ్చెననిన, శతవర్షతూషమున నెచ్చటను సోమలత యెండి కొనరాకి యుండగా, వానవచ్చినతోడనె యది మొలకవేసి కొన్నిదినములకు వృక్షమురీతిఁ బెద్దదగుచువచ్చెను. గరుత్మంతునకది ప్రియమగు వృక్షముకావున దానిపై వ్రాలెను. అదిగని యప్పటియార్యులు గరుత్మంతుఁడు సోమలతఁదెచ్చెనని భావించిరి. ఇది నా యూహ. సోమపానమునం దింద్రునకు నపేక్షయని యింద్రునకు "సోమపా" యను నామమిడిరి. బాల్యముననే యింద్రుఁడు సోమపానమునం దపేక్షకలవాఁడయ్యెనను టకు నీ క్రింద వ్రాయఁబడిన సూక్తమున్నది.

3. 48. (1) బాలవృషభము ( ఇంద్రుఁడు ) జనించినతోడనె, పిండఁబడిన సోమ రసమును ద్రావనపేక్షించెను. ఇంద్రా! ఈ మహనీయమయిన రస మును నీ యిష్టానుసారము తృప్తికరముగఁ ద్రావుము.

(2) నీవు పుట్టినదినముననే సోమరసమును ద్రావ నపేక్షించితివి. పర్వత ములవలనఁ దెంపఁబడిన సోమరసమును ద్రావుము. నిన్నుఁగనినతల్లి, నీ తండ్రియింటిలో సోమక్షీరమునుఁబోసి నిన్నుఁ బెంచెను.

(3) ఆహారాపేక్షకుఁడయి నీవు నీ తల్లినిఁ జేరితివి. నీ తల్లి యెదపై సోమ లతను జూచితివి. ఇతరులను దూరముగనుంచి నీ వొక్కఁడు బుద్ధి కలవాఁడవయి యనేకశక్తులతో బలుసాహస కర్మములొనర్చితివి.

వానవచ్చినంతనె సోమలతలోఁ బాలుపుట్టుట సహజము. వానవచ్చిన దేశము సుభిక్షమయినతోడనె యజనాద్యాగమ కర్మములొనర్చుటకు సోమలతనుఁ బిండి యింద్రునకు నా రసమునుఁ బానీయముగఁ బలినిత్తురు. ఈ రసమును ద్రావి యింద్రుఁడెటు తన సామర్థ్యమునుఁ దానే యుగ్గడించి పలికెనో యా సూక్తమును నేనిదివఱకే వ్రాసినాను. ఆర్యులు పంజాబుఁ జేరి దస్యులతో యుద్ధమొనర్చి దేశములు సాధించి తమయునికిపట్టు భద్రపఱచికొను నంతవఱకు వా రింద్రుఁడే తమదైవమని మిక్కిలి గౌరవముగఁ బూజింపసాగిరి. ఆ గౌరవ మార్యులు గంగాతీరమువఱకు దేశములు సాధించి యచట రాజ్యములు స్థాపించునంతవఱకు నుండినది. అనఁగా బ్రాహ్మణుల కాలములోను నుండినది. పిదప నిప్పటి త్రిమూర్తు లుద్భవించు టకు మొదలిడి, పురాణయుగమునఁ ద్రిమూర్తుల మహిమ యతివిచిత్రముగ గౌరవింపఁబడినది. భాగవతకాలమునకు నింద్రునకు బలులిచ్చి యుత్సవములు సలుపు, కర్మసైతము నిలుపఁబడినది. ఈ కాలము వచ్చునంతవఱకు నార్యులు విగ్రహారాధకులయి యుండినరీతిగ నగపడదు. గుళ్లవిషయము ఋగ్వేదమున నెచ

నను బలుకఁబడలేదు. ఇపుడార్యులొనరించు నాగమహిమునను బల్యర్పణము దప్ప యగతవ్రతదీక్ష లేవ్వియు నుండలేదు. లక్ష్మీపార్వతుల నామములే యప్పటికి నార్యులకుఁ దెలియవు. అప్పటిలో నింద్రుఁడు తన సాహసమునఁ జంపినవారెవరనిన అహి, యర్బుద, యౌర్ణవాభ, అశ్న, బ్రసయు, చుమురి, దాసోని, ధుని, ద్రిభీక, ఇలీబిస, కరంజ, కునారు, కుషావ, కృప, కుయవ, మృగ, మృగయ, నముచి, పాని, పర్ణయ, పిప్రు, దధిక్రా, శంబర, శుష్ణ, స్వర్భాను. స్వస్న, యురాన, వాల, రంగ్రుద, వర్చిన, వితాసు, విశ్వాక్, వ్యంస, వృత్ర;

వీరివిషయమునఁగల ఋక్కులుగొన్ని వ్రాయకయున్న వీరెవరయి యుండిరియు నించుక తెలిపినఁగాని యజ్ఞులకు బోధపడదు.

సూర్యరశ్మి జలమునుఁజీల్చి మరుత్సహాయమున నున్నతప్రదేశమునకుఁ గొనిపోయి యచట శీతవాతమువలన నాజలము ఘనీభవించి మేఘలోకమేర్పడుట ప్రకృతి సహజమహిమ. మరల ఋతువిధుల ననుసరించి ఘూర్ణఘూర్ణారుతశక్తిని ఘనీభవించిన మేఘమండలము జలవరించి మేఘాంతర్గతజలము మరల భూమికిఁ గురియుట ఋతువిధిక్రమము. పైరీతి నార్ద్రధూమము జలమునావరించి ప్రవింపకుండు టుల చేయును కావున దానికి వృత్రయను సంకేతనామము. అటు ఘనీభవించిన మేఘము లనేకములగు చిత్రాకారములుగొన్ని యగపడుటచే నాయాకారములకు నార్యులు భిన్ననామములిడి, వారు రాక్షసులని పేరిడిరి. అట్టిమేఘరూపముల నామములు గొన్ని పైపట్టికలోఁ జేరినవి. ఇంద్రుఁడు మరుత్సహాయమున మేఘములనుఁజీల్చి వర్షము గురియులాగొనరించెను.

I. 1. 32-వ సూక్తములో "వృత్రాహి" శబ్దములున్నవి. మేఘమండలమున మేఘముల నావరించి దాఁచినవాఁడు వృత్రుఁడు. పర్వతములపైన వ్రాలిపడిన మేఘపఙ్క్తికి నహియని పేరు.

83. [4] పాణియను నామమున్నది. మేఘపఙ్క్తిగుహలో దాఁచి లోభిబలె నీరు వెలికివదలక యుండువాని పేరు.

13 "వాలి" యని యున్నది. మేఘములనుదాఁచిన గుహాధికారి.

51. "అర్బుద" యని యున్నది. గాలిలో వానచినుకులు జిక్కించుకొనిన వాని పేరు సుష్ణ. నీరు నెండించువాఁడు శంబర పిప్రుయనువారు గాలిమార్గమున నీరు క్రిందఁబడినటుల దూరమునకుఁ దీసికొనిపోవువారు.

వైకృతి వ శేషి ఋక్కులలో నీ యసురుల నామములున్నవి. వీరు హోమ దేవతలు. ప్రకృతిశక్తుల నెదిరించుశక్తులివి.

ఇంద్రుఁ డహల్యాజారుఁడని మన పురాణగాథలు పలుకుచున్నవి. ఆ విషయమును గురించి రామాయణములోఁ బెక్కువిధముల వర్ణింపఁబడినది. అహల్యయన దున్నఁబడక బీడుపడినభూమి. ఆ భూమినిఁ దడపుటచే నింద్రునకు నహల్యాజారుఁడని పేరుకలిగెను. సహస్రాక్షుఁడని యింద్రునిపేరు. అనేకముఖము లుగ వర్షధారలు కురిపించువాఁడని యర్థము. “శతక్రతుఁ”డన ననేకకర్మము లొనరింపఁ జేయువాఁడని యర్థము. మఘవానన ననేకయాగము లొనర్పఁ జేయు వాఁడని యర్థము. అహల్యయనఁ జీకటియనియు నింద్రుఁడన సూర్యుఁడనియు చీకటినిఁ జెఱచినవాఁడు సూర్యుఁడు కాఁబట్టి యింద్రునకు నహల్యాజారుఁడని పేరు వచ్చెనని కొందఱి యభిప్రాయము. ఈరీతి వానగురియుటవలనఁ గలుగు ఫలముల కెల్ల నింద్రుఁడధికారిగ నెంచి నామములిచ్చినారు. ఋగ్వేదమునం దనేకఋక్కులలో నింద్రుఁడొకదినమున నూరుకోటలు చీలఁగొట్టినవాఁడని యున్నది. దస్యులీ కోటలు పర్వతములపైఁ గట్టియుండిరి. భూమి వర్షాపాతమునఁ గోటలు పడిపోయినపుడు కోటలింద్రునిచేఁ బడఁగొట్టఁబడెనని వర్ణించినారు. పిడుగులుపడి చీలినపు డింద్రా యుధమునఁ జీల్పఁబడెనని వర్ణించినారు. ఇట్టివాక్యములు వచ్చినపుడు చదువరులు బుద్ధినుపయోగించి యర్థముచేసికొనవలెను. ఋగ్వేదమునం దింద్రునిగురించిన ఋక్కులు మిగతదైవములకంటె హెచ్చుగనున్నవి.

ప్రజాపతి తనబిడ్డను మోహించెనని యున్నది కావున నార్యుల దైవ ములకు నైతము నీతిలేదని కొందఱాక్షేపించినారు. ఇటులనే బౌద్ధులాక్షేపించి నపుడు కుమారిలభట్టను పండితోత్తముఁడు క్రిందవ్రాసినరీతిగ సమాధానము చెప్పెను. “సృష్టికర్తయగు ప్రజాపతి సూర్యుఁడేను. ప్రజలను రక్షించును గావున ప్రజాపతియను నామమువచ్చెను. సూర్యునిబిడ్డ యుషస్సు. దానిని మోహించె ననఁగ, సూర్యోదయకాలమున సూర్యుఁ డుషస్సును వెంబడించును కావున మోహించి వెంబడించెనని వర్ణించినారు. సూర్యుఁడు వచ్చుటవలన యుషస్సు పుట్టును కావున “ఉషస్సు” సూర్యునిబిడ్డయని పిలిచినారు” ఆర్యుల యర్థమును దెలి యక యార్యులదైవమగు నింద్రుఁ డహల్యాజారుఁడని నిందించుట తప్పు.

అతిపురాతనార్యుఁడేమియుఁదెలియక చిత్రమహిమలు గలిగించుశక్తి నాఁడియగోచరముగాక యొకటియున్నదని యూహించి యాశక్తిని నుతించు వగ్నినిఁ గనిపెట్టి యగ్నియేదైవమని భావించి యిప్పటికిని నగ్నియే

# ప్రకటన.



బళ్లారిలో వకీలుగానుండి కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపబడిన యీక్రింద వివరించిన యుపన్యాసములన్నియును విక్రయమునకుసిద్ధముగనున్నయవి.

| | | |
|---|---|---|
| 1. | ఆర్యుల నాగరికత వారి ప్రపంచవ్యాపకత. | 0-8-0 |
| 2. | ఆర్యుల చరిత్ర, ఋగ్వేదభాష మొదలగునవి. | 0-8-0 |
| 3. | ఋగ్వేద విభజన వేదకాల విభజన మొదలగునవి. | 0-8-0 |
| 4. | ఆర్యులుపంజాబు చేరిన విధము వారిశాసనము. | 0-8-0 |
| 5. | మద్యపానము జూదము స్త్రీలగుణములు మొదలగునవి. | 0-8-0 |
| 6. | వివాహశట్టడములు ... | 0-8-0 |
| 7. | జాతిచట్టములు ... | 0-8-0 |
| 8. | సృష్టిని గురించిన తాత్పర్యము. | 0-8-0 |
| 9. | వేదమతము నాస్తికమతము ఆర్యులదైవములు. | 0-8-0 |
| 10. | నరమేధ అశ్వమేధాది యజ్ఞములు. | 0-8-0 |
| 11. | అదితి ద్వాదశాదిత్యులు మొదలగునవి. | 0-8-0 |
| 12. | యమ యమి మృత్యువు పితృదేవతలుకర్మ మొదలగునవి | 0-8-0 |
| 13. | సోమపానము అశ్వినులు రుద్రుండు పర్జన్యుండు. | 0-8-0 |
| 14. | ఋషులు, సప్తర్షులు, దధీచి, చ్యవనుండు మొదలగునవి. | 0-8-0 |
| 15. | ఋగ్వేదములోని ముఖ్యప్రార్థనలు | 0-8-0 |
| 16. | మతవిధులేరీతిగం బ్రబలినది ... | 0-8-0 |

వలయువారు ఈక్రింది చిరునామాకు వ్రాయవలయు.

కె. శత్రుఘ్నరావు,

సివిల్ లైన్సు, బళ్లారి.